# “ధిరిణఫలో”



( కాంగ్రెసు ప్రచార నాటిక )

రచయిత:

“శ్రీవాణీ ప్రసాద్”

ప్రచురణ:

భారత జాతీయ కళా మండలి,

శివాజీ బిల్డింగ్సు, బాపట్ల.

# ఒక్క మాట

కళ, వినోదం, రాజకీయ దృక్పథం - మూడింటిని మరువకుండా ప్రచారనాటకం వ్రాయడానికి తగిన సమర్థత లేనివాడనని నాకు తెలుసును అయినా, మంచి ప్రచారనాటకాలు మాకు లేవు గనుక, కళామండలి కార్యక్రమానికి భిన్నం లేకుండా వుండే గమనించుకొని యీనాటకం వ్రాసాను వీలైనంతవరకు లోటుపాట్లు లేకుండా చేసాను. పొరపాట్లను మన్నించమని పెద్దలను వేడుకొంటున్నాను. పాత్రలన్నియూ కేవలం కల్పితములు.

భారత జాతీయ కళామండలి ఆశయాలు తెలుసు కోడానికి మా ప్రచురణ .. 'ప్రణాళి' చదువ ప్రార్థిస్తున్నాను. కాంగ్రెసు ఎలెక్షన్ ప్రచారానికై ముఖ్యంగా యీనాటకం వ్రాయబడినది మా రెండవ ప్రచార నాటకం 'నా దేశం' త్వరలో రాష్ట్రంలో అన్ని కేంద్రాలలో ప్రదర్శించ వూను చున్నాము ఉత్తమ జాతీయ నాటకాలు, గీతాలు రచించే వారిని ప్రజలను ఎవరికి తగినట్లుగా వారు సహాయపడి మమ్ముల ప్రోత్సహించ ప్రార్థన.

— రచయిత

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 7 | సంతోషించే | సంతోషం |
| | | ఖైదీలకంటే | కంటే |
| 13 | 16 | పద్యంతో | పద్యంలో ఎంత బాగా |
| 20 | 9 | పోరో బావో | పోరో చావో |
| 27 | 2 | ఝుంతేంపో | ఝుంకేంపో |
| 38 | 14 | రష్యాదే | రష్యాదేశ |
| 39 | | Slegums | Slogans |
| 40 | 8 | చాలక | చేసిన |
| 40 | 8 | క్షేమములు | క్షామములు |
| 42 | 5 | చున్ననూ. | చున్నాను. |

# ప్రథమాంకము

## ప్రథమరంగము

[తెల్లటితెర వెనకనుంచి మాజిక్ లాంటరన్ సహాయంతో తెరపై భారతమాతచిత్రము - తెరకు కుడిప్రక్కగా గాంధీ చిత్రమూ......ఎడమ ప్రక్కగా ఒక యువతి చేతిలో మహాత్మునికి పుష్పాంజలి అర్పిస్తూ వంగి నమస్కరిస్తూ ప్రార్థన.]

ప్రార్థన గీతం (1)

భరతఖండ - భాగ్యదాత
మాపూజల నందికొమ్మిదే॥ భరత॥
నీ మూర్తియే - జాతీయ జ్యోతి
ప్రేమమయీ - సత్యాగ్రహి॥ భరత॥
విశ్వజనన - ధర్మవీరుడా
లోకోద్ధారా - మహాత్మా॥ భరత॥

[తెల్లటి తెరపైనే కాంగ్రెసు పక్షం బాకాలతో జాతీయగీతం పాడు కొంటూ వస్తున్న ఛాయాదృశ్యం - తెల్లతెర ప్రక్కలకు జరిగిపోతుంది. స్టేజిలైట్లు వెలిగించబడుతాయి.]

(మనూ, సుశీల, వసుంధర, వాలంటీర్లు ప్రవేశము.) (1942 ఆగష్టు)

జాతీయ గీతం (2)

జై జై దేశమాతా - జై జై దేశమాతా భరతమాతా॥
నీ యశశ్చంద్రికల జ్యోతిజ్యోతుల।
సర్వలోకములు వెలుంగు గాదా॥ జై జై॥
భారతనేత మహాత్మ గాంధీ

విశ్వమంతటికీ శరణ్యము ॥జై జై॥
బానిసబ్రతుకు భరింప లేము ।
దాస్యవిమోచన ఇది తరుణమురా ।
మము దీవింపుము మాతా ।
దేశమాతా—భరతమాతా ॥జై జై॥

(అవకాశంలో వెనుక వాలంటీర్లు "మా దేశం వదలిపోండి" "స్వాతంత్ర్యం—మా జన్మభూమి" "క్విట్ ఇండియా" అనే బోర్డులుంటాయి...
(పోలీస్ ఇన్స్పెక్టరు ప్రవేశం)

ప. ఇ :— మీరుచేసే ఆందోళన ప్రభుత్వంచేత నేరంగా పరిగణింపబడింది! ... కనుక మీరు మీ కార్యక్రమం మానేసి వెళ్ళిపోవాలి!

మనూ:— మేం వెళ్ళడంకాదు, మా దేశంనుంచి బ్రిటిషు వారు వెళ్ళిపోవాలి. :. భారతదేశంమాది! స్వాతంత్ర్యం మా జన్మహక్కు!... 'మా' జన్మ హక్కే కాదు, మీది కూడాను!...

ప. ఇ. :— అనవసర ప్రసంగం చాలించండి!... మీతో వాదానికి రాలేదు. నాభాద్యత నెరవేర్చటానికి వచ్చాను!...

సుశీల:— మా స్వాతంత్ర్యం సాధించుకోడం, మా బాధ్యత కదా! స్వాతంత్ర్యోద్యమం యొక్క ప్రయోజనం మీరు తెలుసుకోకపోతే!...

స. ఇ. :— అధికప్రసంగం! వీరెక్కడనుంచి ఎవరింట్లో వారు వెళ్తారా లేక జైలులో వేయమన్నారా?

మనూ:— భారత దేశమే ఒక పెద్దజైలయితే .. యింకా జైలేమిటి బాబూ! నీ అధికారం నీకిచ్చే సంతోషం, వుత్సాహం, అండమానులో ద్వీపాంతరవాస ఖైదీలలో, యితర ఖైదీలపై అధికారమిచ్చినవాని సంతోషింపే ఖైదీలకంటే అయోమయమైనది!... దేశమంతా స్వాతంత్రసమరంతో ప్రతిధ్వనిస్తూ, ప్రపంచమంతా మారుమోగుతుంటే, నీగోడు నీదే ననడం... మునిగిపోతున్న నావలో నాట్యం చేయడం కాదా!........

స ఇ:— సైలెన్సు! - మిమ్మలందరినీ అరెస్టుచేశాను!... (అందరికి బేడీలు తగిలించుతాడు.. వారందరూ Slogans మళ్ళా అంటారు)

సుశీల:— (వసుంధరను దగ్గరకుపిల్చి) వసుంధరా! నాన్న గారికి అమితకోపం! ... జాగ్రత్తగా మెలగాలి సుమా! త్వరగానేవస్తాను! ...రాబ్బుం వదుకుతూ వుండు. ఆశ్రమానికి వెళ్తూవుండు!... ...

అందరూ పోతూవుండగా చేతులతో తల రుద్దుకొని వసుంధర ఏడుస్తూవుంటే......

( తెర )

# ద్వితీయ రంగము

[రావు సాహెబు రామనాథశాస్త్రి గృహం - ఒక పడకకుర్చీ, రెండు కుర్చీలు, మేజాబల్ల, స్టేజికి ఒక ప్రక్కగా - వసుంధర రాట్నం ముందేసుకు కూర్చొని పాడుకుంటూ వుంటుంది.]

"పాట" (3)

భారతదేశవిపత్తు మద్య భారతవీరా! లే!
నీభారము రా స్వతంత్ర రక్షనా
నిద్రను విడువరా!
భారత వీరా! ॥భారత॥
విప్లవమిదిరా! నిలబడరా!
నిలబడరా, నీజాతినిదలంచి అహింసయుతముగా
కాంగ్రెసే జాతీయ సంస్థని కదనమునకు రారా!
॥భారతవీరా॥

[పాట అయిపోతూవుండగా వసుంధరతల్లి రాజ్యలక్ష్మి ప్రవేశం]

రాజ్య:—వసుంధరం! పాటలాపవే! మీనాన్నగారికీపాటలు నచ్చవుగదే! వచ్చే వేళకూడా అయింది!

వసుం:—నాన్నగారికీపాట లెందుకు నచ్చవో అడుగనా!

రాజ్య:—నాన్నగారికెదురు చెప్పడమే! యీగృహరాజ్యానికి ఆయన నిరంకుశాధికార చక్రవర్తి! మనమంతా ఆయన చెప్పితే వినవలసిందేకాని.......... ఎదురు చెప్పకూడదమ్మా!

వసు:—నాన్నగారేదైనా పొరపాటు పడితే.....

రాజ్య:—ఇంటి పెద్దలు, కులపెద్దలు పొరపాటు చేస్తారా! అలా అనుకోటంతప్పు...

వసుం—ఒకవేళతప్పు చేస్తారనుకో...

రాజ్య:—అయ్యోరామా! చేస్తే వారు తప్పులు దిద్దటానికి భగవంతుడేతప్ప, యీభూలోకంలో యెవ్వరిచేతా కాదు!

వసుం:—అవునునిజమే! లోకంలో, పిల్లలకు నీతి బోధించే పాఠశాలలున్నాయిగాని, పెద్దలకు బోదించేవి ఏవీ లేవు!

రాజ్య:— యిష్!... పూరుకోవుకదా! వచ్చేవేళకూడాను యీరాట్నం నరంజామా అంతా సద్దూ! వచ్చేవేళకు యివన్నీ పెట్టెకు కూర్చుంటావు...అందులో సుశీల అరెస్టుతో మీనాన్న గారాలు మిరియాలు నూరుతున్నారు!...అరుగోవస్తున్నట్టున్నారు.

(రాట్నం లోపల పెట్టటానికి వెళ్తుంది) (శర్మ గబగబా ప్రవేశిస్తాడు)

శర్మ:— (వసుంధరను చూస్తూ) ఏదీ మీఅమ్మ! ఎక్కడికి పూరేగింది!...

రాజ్య:— (ప్రవేశించుచు) ఎక్కడికి పూరేగమంటారూ! మీరు పూరేగేది చాలదూ!

శర్మ:— (ఉత్తరీయం బల్లమీద పారేస్తూ) "ఎవడు చేస్తాడీ సంసారం! ప్రాణం విసిగిపోతోంది! దాని కెన్నిసార్లు

చెప్పాను. "వద్దే, మనకు రాజకీయాలు—మంచిది కాదే"అని. సిగ్గున్నదయితేగా!... మళ్లా అరెస్టు! .. ఛీ... ప్రొద్దున లేస్తే, జడ్జీలు, కలెక్టర్లు, మధ్య తిరిగే వాడ్ని—గవర్నమెంటువారు నాకెన్నో హొదా లిస్తుంటే—దానికేమన్నా మతిపోయిందా? వుందా? నేను తలవంచుకోవడం తప్ప, మరేమన్నా వుందా? రాజకీయాలట! ఛీ, ఎంతసేపూ 'సత్యాగ్రహం చేస్తాను, జైలుకెళ్తాననే గోలే నీ కూతురూ!

రాజ్య:— అదేమిటండీ, మీకూతురు కాదా యేమిటి?...

శర్మ:- నోరుముయి, ప్రాణంపోతున్నా పరాచకాలాడుతూ కూర్చుంటావ్!

రాజ్య:— అదికాదండీ, పోనీమీరింత పలుకుబడి కలవారు కదా, అరెస్టుకాకుండా చూడకపోయారూ!

శర్మ:— ఊహూ! చెప్పావు!... సలహా!... (అటు యిటు తిరుగుతూ) ఛీ! ఛీ! ..ఎంత తలవ పుగా వుంది!...

రాజ్య:— అంతతలవంపులు, గుండె దడబడలు, యేంవచ్చి నయ్యిండీ! .. మన గ్రామంలో మనం, మన పాడి పంటా చూసుకుంటూ సుఖంగా వుండకూడదూ,— అన్నీ మీరేగాచేసేది!... అంటే కోపం! యీబస్తీ కాపుర మెందుకూ!... యీఅవకతవకలూ తిక మకలూ, రోసరోసలు యెందుకండీ! పోనీ సుశీ లేమ్మనా చదువుకోనిదా!··· సర్వోత్కృష్టమైనదీ, నేనకునేలు దేశనాయకులు, ప్రజ్ఞావంతులూ చేసిందే

అదీ చేసింది.. ...ఎందుకు లేండి—ఎంత సేపూ బయట సలహాలు తప్ప—

శర్మ:— నోరుముయి! (కూర్చుని) అసలు పల్లెటూరి గొడ్డును నిన్ను చేసుకోవటం వచ్చింది! ..

రాజ్య:—అదిగో అందుకే......ఎక్కడున్నా ఏజాతివారు, ఆజాతివారిని పెండ్లాడు తారుగాని, నేను గొడ్డునైతే (మీరో అన్నట్లుచూసి)......మీరెట్లా చెసుకున్నారండీ!...మీరూ వల్లెటూరి......(గొడ్డు అనబోతు న్నట్లుచూస్తూ) వారేగా! ఎటూచ్చి......వరివాట చాలవరకు మానేయడం, బాగాకు పంటలు, లాభాలు, వ్యాపారాలు, బస్తీలు, స్త్రీస్వేచ్ఛముసి పోవడం, నష్టాలు, దావాలు......దగ్గాలు దానితో, పనికిమాలిన హెూదాలన్నీ నెత్తినేసుకోవడం...

శర్మ:—(లేస్తూ) అబ్బబ్బబ్బ ఎవరుచేస్తార్ సంసారం

రాజ్య:—మీసంసారం మీరుచేసుకోక మరోకరు చేస్తారా యేమిటి! బాగానే వుంది! అయినా యింటి కొస్తే సరి, ఒకటేచిరాకు, కోపం, సావకాశంగా, మంచేదో, చెడ్డేదో చూసుకోవడం వుంటేగా, నాకంత కోపతప్ప!

[లోపలతలుపు కొట్టినట్లు శబ్దమయిలే, వసుంధరవెళ్లి తెరుస్తుంది]
[కైతుగోపాలం ప్రవేశం]

శర్మ:—ఏమోయి, గోపాలం, యిదేరావడమా?

గోపా:—మరేనండి బాబూ! మరీయేడు పైరంతా గాలివానతో నాశనమైపోయింది మరినామనవి మాట ఏంజేసేరుకాదూ సుశీలమ్మ చలవ వలన కవులు 2 బస్తాలు ఎక్కువ చేశారుకదా అను కుంటుంటే దేవుడు చిన్నచూపుచూశాడు!

శర్మ:—......(భార్యతో) ఇదిగో!......... నేనుత్వరగా వెళ్ళాలి......వంటయిందా!......

రాజ్య:—రండీ!......

శర్మ:—వడ్డించు, వస్తాను! (రాజ్యలక్ష్మి నిష్క్రమణ) (రైతుతో) ఆ......ఐయితే......ఏమంటావ్!...

గోపా:—ఏమంటాను బాబూ! తాతల తరాలనుంచి మీ భూమిని కనిపెట్టుకున్నాము, మీపాదాలకాడ బతికే వాళ్ళం......యీనాటికి అగచాట్లొచ్చి పడ్డాయి, మరి...మీరు చూడకపోతే, మాగతి యెవరు చూశారు!......

శర్మ:—(కోపంతో) మరియీా తెలివేమైంది. యిదివరకు కాంగ్రెస్, కాంగ్రెస్ అనిగంతులేస్తిరే......

గోపా:—మరేంచేస్తాంబాబూ!.........మాకోసమే కదా, ఇండ్లు వాకిళ్ళు, సుఖాలువదలేసి జైళ్ళకెళ్లేరు, ప్రజా పీడిత ప్రభుత్వంతో పోరాడుతున్నారు!...... సుశీ లమ్మగారుంటే యేదన్నా మార్గంచూపక పోయిందది తల్లి!......

శాస్త్రి:—ఛీ, యింకేం, నీసుశీలమ్మ. కాంగ్రెసుదగ్గర కేపో......(గోపాలంమీదకు వెళ్తూ) ఫో! కూర్చున్నావే!......అసలుమీకు బుద్ధివుందిరా ...... నా గడపత్తొక్కొద్దు. ఫో...

[అతను లోపలికివెళ్తాడు. గోపాలంగుండె జేజారయి పోయింది......]

గోపా:—భగవంతుడా...... ఎలాజీవితం గడపడం!......
చేయటానికి కూలిలేదు!...తినటానికి గింజలులేవు!...

వసుం:—(గోపాలందగ్గరకువచ్చి) గోపాలం!......గాంధీ ఆశ్రమానికి వెళ్దాంపద!.........ఒకరినాశ్రయించి బ్రతుకుతెరవు చూసుకుంటే యింతే! ...... నీవు, నీపిల్లలూ కష్టంపడితే, భగవంతుని కృపవుంటే బ్రతుకలేక పోతారా!......

గోపా:—తల్లీ, నీకున్న యోచన పెద్దలకెందుకు లేదో తల్లీ...మాఅగచాట్లు......

వసుం:—నాకు తెలుసుగోపాలం, మీఅగచాట్లు ఆశ్రమం లో ఒకాయన ఒక పద్యంలో చెప్పాడనుకున్నావు!

గోపా:—నీకొచ్చా తల్లీ ఆపద్యం!......

వసుం:—యిష్......ఇక్కడ పాడితే, నాన్నకి చెడ్డకోపం! అయినా భోజనంచేస్తున్నారు రారులే!......

పద్యం 4.

కడవలు పొర్లగా కడగండ్ల కగ్గమై
పాలతో దొరల హస్తాలతడపి

దినమెల్ల చమటోడ్చి తెచ్చివసంతమ్మ
రక్తంబుతో ధాన్యరాసికూర్చి
మండు టెండల తుమ్మ్రమాగ్రను లందాకట
దూలుబుడతతల నుయ్యాలలూచి
మన్నులో దేదీప్య మానమణులను కూర్చి
పరగృహాములకు హస్తవరము చేసి
మంచుకురిసెడి నిశలోన మంచపైన
రాలుగరిగించు శోకగీతాలుపాడు
కొందువేగాని రక్షించుకొను విధంబు
చింతసేయవదేమి, యోసేద్యకాడ

వసుం:—లేపోదాం ఆశ్రమానికి (యింతలో లోపలనుండి తండ్రికోపంగా పిలిస్తె లోపలికివెళ్తుంటే తెర)

# తృతీయ రంగము

[రైతుగోపాలం ప్రవేశిస్తాడు చినిగిపోయినగుడ్డ, ఎండుకుపోయిన శరీరం, నడవలేకనడవడం......] 1943

### పాట 5

కటిక చీకటిలో కారాగృహమున!
కట్టుబడితివే! దేశమా!
క్షాత్రమిూవనే వీరస్వర్గమా
కాలికిపసుపూ పూతమా
వెరు లేని రణసింహులగాంచి
నీరైపోయితివే — దేశమా — ॥కటిక॥

గోపా:— గాంధి ఆశ్రమము ప్రభుత్వంవశమైనది. జాతీయ నాయకులు ఖైదీలయినారు......ఆహా! ఎటుచూసిన ఆకలి, ఆకలని అల్లాడువారేకాని శరణ్యమిచ్చు వారు లేరుకదా! కార్మిక, కర్షకజీవిత మెంతదారి తెన్నూలేని దేవులాటైనది!...దారిచూపువారేరి!... (లోపలికిచూస్తూ) ఆమహాను భావుడెవరో జాతీయ నాయకునివలె నున్నాడు!...

[లోపనుంచి ముసుగులేసుకొని గీతంపాడుతూ అహోబలరావు ప్రవేశిస్తాడు]

### గీతం 6

దేశమంటే మట్టికోయి సోదరా!
దేశమంటే మట్టిరోయి ॥

రైతుకూలీ లేతపైతే!
హిందూముస్లిం లేకపైతే ॥
స్వాతంత్రమం తప్పదోయి
కాని
దేశమంటే మట్టిరోయి ॥

[ముసుగులోనుంచే]

అహో:— జాతీయనాయకుల విడుదలచేయాలి! మహాత్మా గాంధీకీజై! ప్రజానీయకానికీజై! (అంటూ ముసుగు తెరుస్తాడు) (రైతునిచూచి) ఓహో! ప్రజలు నాయకులు లేక ఎంత అల్లాడుతున్నారో యీరైతునుచూస్తే వ్యక్తమవుతుంది! నీ పేరేమిటోయి!

గోపా:— గోపాలం! బాబూ!

అహో:— ఓహో! కామ్రేడు. జ ఆలం! గోపాలం అన్నమాట! మన దేశనాయకులను విడిపించాలి! ఆందోళనచేయాలి!

గోపా:— నిజమే బాబూ, చాలా అగచాట్లు పడుతున్నాము. నాయకులంతా జైళ్ళలోవున్నారు. ఏదో ఒకదారి.

అహో:— అదేనోయి. దానికే మనన్నావాలుకూడా! ముందరపార్టీలోచేరు!

గోపా:— పార్టీయేమిటి బాబూ కాంగ్రెసేగా!

అహో:—కాంగ్రెసేనోయి 'పార్టీ' అనేది మనలోమనం కొట్టుకోటానికి ఉపయోగించాల్సిన "పార్లమెంటరీ భాషాయిజము"!... ..మాదికమ్యూనిష్టుపార్టీ!......

గోపా:—అంటే ఏమిటి బాబూ!......

అహో: కమ్యూనిజమంటే!......ఫాసిజము, నాజిజము సోషలిజము, ఇంటర్నేషలిజము, అహింసాయిజము, అనార్కిజము వీటన్నిటికిమించిన మెస్మరిజము!

గోపా:—మెస్మెరిజమంటే గారడా బాబూ!

అహో:—మనదేశంలో ప్రవేశపెట్టినంతవరకూ, నాకర్థమాయినంతవరకూ, ఆ—అది గారడీయే—అయితే రాజకీయగారడీచున్నమాట!......లేకపోతే మరిదాని ఫవరుకు ఎంతమంది పామరులు పండితులు ఫల్టి కొట్టారు!......మెస్మరిజ మంటేను జాఖామరి!

గోపా:—మరి బాబూ, కాంగ్రెసువారు చెప్పిందేనా మీరు చేయడం!

అహో:—అంతావొకటే నోయి!...... ప్రజాబాహుళ్యము, ప్రజాభ్యుదయము, ప్రజాయుద్ధము, ప్రజాజీవితం అవేమాసిద్ధాంతాలు కూడాను!......నీవు పార్టీలో చేరితే, తర్వాత కార్యక్రమం! ముందర 'మెంబరిజమ'యి 'పావరిజమవలంబిస్తే.........

గోపా:—అంటే ఏమిటి......

అహో: అంటే పార్టీ నిబంధనలు చాలగట్టివి. ముందర నీకున్న ఆస్థి పార్టీకి రాసిచ్చి, 'మెంబరిజము' అయితే,

తర్వాతనైను 'పావరిజము' సిద్ధాంత మవలంబించడం వల్ల పార్టీకి చిరకాలం బద్ధుడౌతావు! నీవు మళ్ళా తప్పుకోకుండా!......

గోపా:—నాకేమి అస్తులులేవు బాబూ, కావాలంటే అస్థులు న్నాయి!......

అహో:—అవిచారలవ్రటోయి. ఆస్తిలేకపోతే, నీసాంప్రదాయం, ఆత్మ గౌరవం లేవు! అవేపనికి వచ్చేరి!

గోపా:—మరి నాయకులతోపాటు మీరుజైలు కెళ్ళలేదా బాబూ!

అహో:—క్రిందటి దఫా వెళ్ళానోయి, యిది ప్రజాయుద్ధంకదూ! అంచేత, బయటవుండి పనిచెయ్యాల్సొచ్చింది!

గోపా:—(తికమకపడి ఆలోచన) ఈ యుద్ధము మనకేమి ప్రయోజనం లేదనేగా నాయకులు యుద్ధంలో చేర కూడదన్నారు! ప్రజాయుద్ధమా బాబూ! మాకు తెలవదే! ప్రజాయుద్ధ మెట్లా అయింది బాబూ!

అహో:—అరే; ప్రజాయుద్ధ మెట్లా అయిందంటే... ఈ యుద్ధం ప్రజలు చేయకపోతే గుర్రాలు, గాడిదలు చేసినయటోయి!...యుద్ధంలో పాల్గొనటానికి 'గుండె దడబడి జము' మొక్కవై అహింసాయిజ మంటూ కాంగ్రెసు తప్పుకున్నదిగాన!

(యింతలో యిద్దరు విద్యార్థులు ప్రవేశించు చున్నారు)

1 వి:—నమస్తే! అహింసాగారూ!

అహింసా:—నమస్తే!

1 వి:—మా యిద్దరికీ కమ్యూనిజానికీ, సోషలిజానికీ భేదం తెలియలేదండీ! ..

అహో:—శేభ్! అలా పెద్దవాళ్ళ నడిగి తెల్సుకోవాలి! మీ గ్రూపేమిటి!

1. వి:—లెఫ్టిలండీ!

అహింసా:—భేదం ఎంతో లేదు! సోషలిజము+రౌడీజము = కమ్యూనిజము. అంతే!

1 వి:—అయితే నేను సోషలిష్టును గదా, కమ్యూనిష్టవ డానికి (అని అహింసాను కొట్టి యిద్దరూ వెళ్తా వుంటారు. చెంపమీద చేయివేసుకొని విద్యార్థుల వంక చూస్తూ అహో నిల్చుంటాడు. రైతు వెళ్ళి పోతాడు.)

అహో:—ఖర్మిజము!...మరి యీ కమ్యూనిజ మేమిటో, మెస్మరిజ మేమిటో......(మాయా మేయ జింగా వుందే!...అంటూ యిటు తిరిగి రైతుకోసం చూస్తే రైతు వుండడు. అంతర్ధానమైనాడా అన్నట్లుగా చూచి) దేవుని లీలాయిజం!

(తెర)

# చతుర్ధరంగము

[కరువు కాటకాలతో ప్రజలు వేనకువేలు మృత్యు దేవతకు బలై పోతున్నారు. ఎక్కడ చూసినా శవాలు. దేశమంతా శ్మశానం లాగ ఉన్నది. జీవించియూ మరణించిన వాని బోలు రైతు గోపాలం ప్రవేశం]

గోపా:—సుశీలమ్మ విడుదలైవచ్చే దాకా ప్రాణం నిలువు కుందా మంటే సాధ్యంకాకుండా వుంది!... ఆ మహా మారితల్లి... భార్య పిల్లలతోపాటు నన్నూ తీసుకు వెళ్తే...అబ్బ...అడుక్కు తిందామంటే అడుగు వేసే ఓపిక కూడా లేకుండా పోతున్నది...అబ్బ..: నాపా పానికి ఎవరినంటే ఏమిలాభం! యిష్ ..(కూర్చుని) అబ్బ...దాహం...దాహం (అనిపడిపోవును)

[విడుదలైన కాంగ్రెసు దళం జాతీయ గీతం పాడుకుంటూ వస్తుంది సుశీలకునూ యితర వాలంటీర్లు]

జాతీయగీతం (7)

ఢిల్లీచలో!!

ఢిల్లీ చలో!!!

భరతనేత భాగ్యదాత

*బోసుబాబు పిలిచెరా

సాగిరమ్ము సోదరా!

జాతికూలిపోవుచుండు

చూచుచుందువా!

సమర భూమికీ
సాగిరమ్మరా...... ॥భ॥
బాల్ ఖిల్ల చేతబట్టి
జాతిజెండ నెగురవేయ
పోరుసల్పరా!
స్వాతంత్ర్య స్వర్గమునకె దారితీయరా!

మన రైతుకూలి రాజ్యమునకే రైతువీర రక్తమీయరా!
మన అజాదు హిందుఫౌజునకె ప్రేమమీర రక్తమీయరా!
ఏ గా? బాపో? తేలునంచు పట్టుబట్టరా!
ఓ భారతీయుడా! ఓ భారతీయుడా!
"ఢిల్లీచలో!!!"

సుశీల:—(పడివున్న గోదాలాన్ని చూస్తూ) పాపం! యెవరో పేదరైతు... యెవరూ?... మా రైతు గోపాలమల్లె వున్నాడు! ... గోపాలం! ... (గోపాలం దాహము అని సంజ్ఞ చేస్తాడు) (ఒక వాలంటీరు మంచినీరుకోసమై వెళ్తాడు) అహా! ... భారతజాతి కెంత అధోగతి సంప్రాప్తించినది! ...... అమాయకులైన యీ కార్మిక, కర్షకులు, ధనవంతుల పేరాసచే ప్రజాపీడిత పరిపాలనచే దిక్కులేక చనిపోతువుంటే చూస్తున్నారా? స్వజాతీయుల నిట్లేనా ఆదరింప వలసినది! ...

మనూ:—'ప్రజాయుద్ధం' వల్ల ప్రయోజనాలు చూడటా-
మొదలెడుతున్నాము!...

సుశీ:—మనూ యీతని ఆశ్రమానికి తీసుకువెళ్ళి తగిన
చికిత్సజరపాలి (గోపాలానికి మంచినీరిస్తాది) రైతు
గోపాలాన్ని లేవుకొని మెల్లగా ఆశ్రమానికి తీసుకు
వెల్తుంది)



## పంచమరంగము

[శర్మగృహం. శర్మ దగ్గుతూ కొంచెము నిస్త్రాణగా వుండటంవల్ల పడక కుర్చీలో కూర్చునివుంటాడు. అహోబలరావు ప్రక్క కుర్చీలో కూర్చొని వుంటాడు]

శర్మ:—యికమన వ్యాహారము బడకపడ్డట్టేనోయి!

అహో:—అంతే కదండీ! పిన్నలు పెద్దలౌతారు! పెద్దలు
దుమ్మవుతారు! 'సృష్టింజం' కాదండీ, మరి! ఆ...
మీతో చెప్పాలనుకుంటున్నాను. రష్యా దేశం
నుంచి ఓ మాంచి మెస్మరిస్టు వచ్చాడు……ఆ
యనకు చూపిస్తే!……

శర్మ:—పోనీ, ఓ మారు వారిని తీసుకరాగూడదూ!……
(దగ్గు)

అహో:—అలాగే......అయినా పాపం!...మీ పరిస్థితులు చూస్తే జాలివేస్తుంది! వయసుమీరిన తర్వాత సంసారంలో సుఖంలేకపోతే, మనసుపాడయి, ఆరోగ్యంపాడయి.

శర్మ:—నిజంచెప్పావు!......సరే గాని......మీ కేదో యీ మధ్య నూతనపంథా తొక్కినట్లు పత్రికల్లో చూస్తున్నాను!...

అహో.—పార్టీని బలపరచుకోడానికి 'బరిసెలిజము' అని కొత్తసిద్ధాంతాన్ని సందర్భానుసారే ప్రయోగం చేయడం.. యింకా చాలావున్నయిలెండి!

శర్మ:—మంచిపని చేసారోయి!... భలె!... ఆ ఆటకట్టే సమయానికి అడ్డంపడ్డారు అంతేచాలు!...

అహో:—చూడండీ!... మీ అమ్మాయి సుశీలకి మీరు కొంచెం చెప్తేమంచిది!... ఎందుకు చెప్పండి మీ అమ్మాయికి 'రాజకీయిజము' గౌరవ కుటుంబానికి చెందిన యువతి .. ... అందులో 'రావుసాహేబు కూతురు'

శర్మ:—ఏంచేస్తామోయి! చాల అప్రతిష్టగావుంది!...

అహో:—రావుసాహేబు కూతురికి రాజకీయాలంటే యింకా యేమన్నవుందా!... లోకమేమనుకుంటోంది!... ఎందుకులేండి!... నాకెందుకు!...

శర్మ:—అనుకోక మానుకుంటుందా! అనేక విధాలుగా అనుకుంటుంది. ...

అహో:—"యీడువచ్చిన యువతి, ఆడుబొంగరం లేని వారితో తిరగడం ... అసలుతండ్రి ననాలి! ... వూరిలో హోదాలెన్నోవుండి, బాధ్యతలు వహిస్తూ, ఆమాత్రం కూతురుకు చెప్పకోలేక పోయాడా!" అని ఎన్నివిధాల అనుకుంటోందండీ! ... మనం కళ్ళుమూసుకుంటే లోకం కళ్ళుమూసు కుంటుందా!

శర్మ:—(కోపం) నా మాటలంటే లక్ష్యం లేకపోయె! ... నా పేరుప్రతిష్టలు పోయిన తర్వాత యీ సంసారం వుంటేనేం, వూడితేనేం! ..

అహో:—మొన్న పట్నంవెళ్ళినప్పుడు 'మీ రావుసాహేబు బిరుదు లాగేస్తారని ఒకటేగోల! ఏదో మీ క్షేమాభిలాషిని గనుక చెప్తున్నాను. మీరు మేలు కోకపోతే...

శర్మ—(లేస్తూ) నే ననుకుంటూనేవున్నా! ... ఛీ! ... యీ సుశీల విషయం యేదో తేల్చాలి! . సుశీలా, సుశీలా! ...

[వసుంధర ప్రవేశం]

వసుం:—వస్తోంది నాన్నగారూ!...

అహో:—(స్వ) యీ అమ్మాయిని చూస్తే నాకేదో విధవ 'పెనిమిటి' గుండె 'బేజారిజము' ... మనకెక్కడ

వుండటం అంత మంచిదికాదు! ... (శర్మతో) సరే నేనిక వెళ్ళివస్తాను. మెస్మరిస్టుగారిని తీసుకువస్తా లెండి! ... (అవతా వెళ్తాడు)

శర్మ:—సుశీలా! (సుశీల ప్రవేశం కోపంతో) నీ ప్రవర్తన నాకేమి బాగుండలేదు ... యికనుంచి?

సుశీల:—నేనేం అక్రమమైన కార్యంచేస్తున్నాను నాన్నగారు!

శర్మ:—నాపేరు, నాహోదా, నాప్రతిష్ట నీటిపాలుచేస్తు యింకా ఏమిచేస్తున్నా నంటావేమిటీ!...ఏదీ, మీ అమ్మ ఎక్కడికివెళ్ళింది!

సుశీల:—దేవాలయంలో హరికథకు వెళ్ళిందండీ!

శర్మ:—యీ గృహంలో ఒక్కటి నే ననుకున్నట్లు జరిగితేగా.........నీవు మట్టుకు నీవు శర్మ (con) ఎన్ని మార్లు చెప్పాను! దేశభక్తిట దేశభక్తి.

వసుం:—దేశభక్తినేం మా నాన్నగారూ?

శర్మ:— ఊహూ! అడిగావు ప్రశ్న! ..యింకే! నీవుకూడా తయారైయినావు!.. ...(సుశీలతో) నీ కాంగ్రెసు గొడవలు మానుకోకపోతే......

సుశీల:—పరమ పవిత్రమగు స్వాతంత్ర్యోద్యమము-గొడవగా వున్నదా .. గాంధి మహాత్ముడు, లోకోద్ధారుడని, తనస్వాతంత్ర్య రాగముతో ఆత్మతేజముతో

భారతజాతిని వెలుగొందజేసిన జాతీయవెలుగు, వెద జల్లిన, బాటలో సేకదా నేనడుచుచున్నది!

శర్మ:—ఒకరితో మనకి పనేమిటి, నిన్ను విరమించుకో మన్నాను అంతే! అందులో యీడువచ్చిన పిల్లవి...

సుశీల:—ఎంత పొరబడుచున్నారు నాన్నా!...లోక కళ్యాణానికి పాటు బడే కాంగ్రెసు సంస్థకార్య నిర్వహణంలో పురుషునికి స్త్రీ తోడునీడగా లేనిచో, మన మొక అగుడు ముందుకు వేయజాలమని మాత కస్తూరిబాగాంధి అరుణా అసఫ్అలి, సుచేత కృపాలిని, ఝాన్సి లక్ష్మి మున్నగు భారత నారీమణుల జీవితాలు వెల్లడి చేయడం లేదా!...

శర్మ:—ఏమిటి నీ వుపన్యాసం!...

సుశీల:—ఛీ కంటే నాకు ఆప్తులెవ్వరూ లేనగనుక నా హృదయంలోని భావాలు వెలిబుచ్చుకొంటున్నాను కాని......

శర్మ:—ఇక చాలు! ... నే నొక్కటి చెపుతున్నాను. ఈ యింట్లో వున్నంతవరకూ నా కెదురు చెప్పడానికి వీలులేదు. నే చెప్పిన రీతిగా వుండు లేదంటావా బయటకు నడవాలి!...

సుశీల:—నేరములేకుండగనే శిక్షవిధించు చుంటిరా?

శర్మ:—(అటు యిటు తిరుగుతూ) యీ రోజునుంచి నీవీ యింట్లో వుండనక్కర లేదు! ...

వసుం:—నేను వస్తానక్కా! ...

శర్మ:—యింతేనా, అందరూ పోండి, హాయిగా బ్రతుకుతా?

సుశీల:—(వసుంధరతో) మనమిద్దరం లేకపోతే వారికి దిగులుగాదా, తల్లి నాన్నగారిది తాత్కాలిక కోపంగాని వేరుకాదు ...

శర్మ:—వెళ్ళిపోవడానికికూడా సిద్ధమయ్యావుగాని, మాట వినదలచుకోలేదు...పో, యీ క్షణం పో.

సుశీల:—(స్వ) విపరీతకాలమన్న యిదియేకదా! సర్వోత్కృష్టమైన కర్తవ్యమునందుకూడ తండ్రి బిడ్డలకు కలహాములు ..దేశమాత దాస్యశృంఖలా విచ్ఛేదన కార్యక్రమములో నిమగ్నదమయ్యెదను. జాతీయ కాంగ్రెసు పూరించిన శంఖారావ సందేశమే నా సోదరిమణుల కందచేస్తాను. (నిష్క్రమణ)

(తెర)

---

# ద్వితీయాంకము

## ప్రథమరంగము

[ఆశ్రమం - రైతు గోపాలం పొలంనుంచి అప్పుడేవచ్చి పాకలో కపక్కనుంచి రాట్నంముందర కూర్చొంటాడు]

ఆహా! భరతభూమి యెంత దుస్థితికి లోనైనది?

ధనజన వస్తువాహన సమ్మతమగు
భారతభూమి నేలుకో
మనల విభేదముల్ గలచి
మాంద్యతనుంచి చిరంతనంబు పె
త్తనము చెలాయిణౌ జరువు
తాంత్రిక పద్ధతి గుర్తెరుంగరే
జనని విపత్తుదీర్ప జయశంఖమని మ్రోగెడీ
లెండు సోదరుల్.

[మనో ప్రవేశం చేతులోని మందుల Hand-bag ను బల్లమీద పెట్టి ముందరకు వస్తాడు.]

గోపా—ఏం బాబూ! రామిరెడ్డికేమన్నా నిమ్మళంగావుందా?

మనో:—పరవాలేదు కొంచెము నెమ్మదిగానే వుంది ... పెద్దవాడు! ... యింకా కొన్నిరోజులు పోతేగాని చెప్పలేము. ...

గోపా—యేదో పాపం మీ చేతిచలువన నయమౌతే! అతను మూలపడితే, నాలుగు గింజలు తెచ్చిపడేసే దిక్కేలేదు! ...

మనో:—అన్నట్టు రామిరెడ్డి కేదో డబ్బవసరంగా వుం దిటా!...వాడిభార్య 'వడికిన నూలు తీసుకుంటారా' అని అడిగింది; తీసుకురా! కిమ్మతు యిచ్చేదాం!...

[రైతు వెళ్తూవుండగా అహోబలరావు ఒక ప్రక్కనుంచి ప్రవేశించును.]

అహో:—(స్వ) గోపాలంతో మాట్లాడుదా మనుకుంటే మనోహరరావుకూడా వున్నాడే!

మనో:—(అహోబలరావును చూసి) రా! అహోబల రావు! యిలా కూర్చో! యేం దోవతప్పి వచ్చావ్!

అహో:—వూరికే గోపాలంతో పనివుండి వచ్చాను! వీడితో మాట్లాడాలి,...(లేస్తూ) వస్తా!...

మనో:—యిప్పుడే వస్తాడు కూర్చో! మన పార్టీల అభిప్రాయ భేధాలు అర్థం చేసుకొని ఒక మార్గాన నడువవచ్చు!...

అహో:—అబ్బే! మన సిద్ధాంతాలేవేరు, మన ఆశయాలే వేరు, మన మార్గాలు విడిపోయినయి! ...

మనో:—ఎంత పొరబడుతున్నావ్! కమ్యూనిస్టులుగాని కాంగ్రెసువారుగాని స్వరాజ్యసాధన విషయమై ఏకీభవిస్తారు కదా!... అటుపైన ఆచరణా విధానము పరిపాలన విధానములోనేగదా భేధము!... స్వరాజ్య ప్రణాళిక విషయమైకూడ రెండునూ వొకటేకదా ... "పరమదరిద్రులూ తమదిగా దేశ

మును భావించుకొన జాలునట్టి దాని నిర్మాణమును వారి పలుకుబడి చెల్లునట్టి అన్నికులముల వారును పూర్ణసామరస్యమున జీవింపజాలునట్టి, మాదక ద్రవ్య సాగాయిపీడన ముండనట్టి పురుషుల హక్కులే స్త్రీలకుండునట్టి స్వాతంత్ర్య భారతజాతీయ జీవనానికే గదా కాంగ్రెసు సంస్థగాని మరేయితర సంస్థగాని పాటుపడుతోంది! ...

అహో:—అందుకనే వేరుపార్టీలుగా వున్న నష్టమేమున్నదీ!...

మనో:—అందరి ఆశయముము లొకటైనప్పుడు. వేరు పక్షములుగా చీలడమేమంత శ్రేయస్కరము! ...

అహో:—ఆశయ మొకటైనా, రోజరోజుకీ వర్పడే పరిస్థితులవల్ల దూరమై పోతున్నాము!...

మనో:—ఎలాదూరమయి పోతున్నాము!...

అహో:—మేం ప్రజాయుద్ధమంటే, మీరు కాదన్నారు. మేం విప్లవమంటే, మీరు "అహింసా యుజమం" టారు. మేము...

మనో:—అవును! మీరు అనేవి అంటూనే వున్నారు. చేసేవి చేస్తూనే వున్నారు. కాంగ్రెసు సంస్థ యుద్ధంలో పాల్గొనకపోతే పంచమాంగ దళమన్నారు. మరు క్షణంలో! జాతీయ నాయకుల విడుదలచేయాలంటూ, ఆందోళన నేతాజీ సుభాష్ చంద్రుని జపాన్ ఏజంటన్నారు. మీరు క్షణము సుభాష్

చంద్రుడు సేనాధిపత్యము వహించిన అజాద్ హింద్ ఫౌజు వీరుల విడుదల చెయ్యాలన్నారు. అందరూ ఏకం కావాలంటారు. ముస్లిం లీగుతో కలసి పాకిస్థాన్ కోసమై గూఢు .పురాసీ!... మీ తికమకలు, మీ బురఖాలు, స్వార్థాలు చూస్తే మిమ్ములను దేశభక్తులనాలా దేశద్రోహులనాలా?

అహో:—మరి ..... మెస్మరిజము!.... మెస్మరిజము!.... యీ ప్రజా బాహుళ్యంలో ప్రజాశక్తి ప్రజ్వరిల్లాలి. విప్లవం రావాలి!... స్వాతంత్ర్యము సంపాదించాలి... బ్రతిమాలితే యెవరన్నా యిచ్చేడా స్వతంత్రం!... అహింసేమిటయ్యా! 'గుండెకెడబడిజము' ఎక్కువై చేతగాక... పిరికివాళ్ళమై!...

మనో:—అహోబలరావు! అహింసా సూత్ర దివ్య సందేశాన్ని అర్థం చేసుకోక మాట్లాడుతున్నావు!... పిరికివారమని హేళన చేస్తున్నావా? 1942 విప్లవంలో నిర్భయంగా, బాలురు సైతము తుపాకి గుండ్లకై ప్రాణాలు కోల్పోయినవారు వీరులా! విప్లవం, విప్లవమని, ఆరాటపడి, విప్లవం వచ్చే సరికి, ప్రజాయుద్ధమనిన పనికిమాలిన వారా వీరులు!!... హింసాత్మక వీరులకు రెండే సుగుణములు, త్యాగము, ధైర్యము! అహింసాత్మక వీరులకు, త్యాగము, ధైర్యము, సహనము శత్రుమైత్రి!!

అహో:—అన్ని దేశాలు యుద్ధాలు చేసి స్వతంత్రిం సంపాదించలేదా!...

మనో:—యుద్ధము శాంతిస్థాపనకు సాధకము కాదని... మనతరం లోనే రెండు యుద్ధములు చూచి తెలుసుకొంటిమి కదా! ..అదీగాక!...మనకళ్ల యెదుటనే కదా! అజాద్ హిందూఫౌజు చేసిన స్వాతంత్ర్య సమరం నిష్ప్రయోజనమైనది! యుద్ధ రంగాలలో ప్రవహించిన రక్తపు ఏరులతో మానవ జీవిత చరిత్ర రక్తాక్షరములతో వ్రాయబడినదే! అదిగాక మహాప్రతిష్ఠమైన బ్రిటీషు సామ్రాజ్యముతో జయశీలముగా పోరాడుటెట్లని యోచించినచో సింహాపాత్మక సన్నాహాలన్నీ అగ్ని పర్వతాలమీద ఆటలుగా లేవా?...

అహో:—అదికాదు మనూ!...

మనో:—అది కాదేమిటి! మీరు చేసేవన్నీ!......దేశనాయకులంతా బందీకృతులైనప్పుడు ప్రజలు నాయకులు లేక కాటకములతో మృత్యువునోట బడుచుండ, కాంగ్రెసు సంఘపు సామరస్యాని చెదరగొట్టి, మారుమూలల దాగియున్న నాయకుల ప్రభుత్వమునకు పట్టించి, రాజకీయ గారడీదో మరొక పార్టీగా దేశాన్ని విడగొట్టిన మీ దేశభక్తి మీ ప్రజాశక్తి... బోధనలేనివాళ్లనా? — జాతీయ మందిరపుపై

యంత్రం నిర్మించు కొనుచుండ, పునాదుల పాడు చేయుచుంటిరిక దా!

అహో:—కాదు మనూ!...కాంగ్రెసులో కొన్ని లోపా లున్నపుడు, పాలసీ సరిగా లేనపుడు!...

మనో:—అలాంటివి మీకు కన్పిస్తే; కాంగ్రెసు సంస్థలోనే వుండి, మీపంథాతో, ఆదర్శంతో, కాంగ్రెసు సంస్థ ప్రజలు మీ మనోవికాసాన్ని గుర్తించే చేయ కూడదా?...

అహో:—అయితే, సోషలిజమని, సోషలిజమని, కమ్యూ నిజమని వివిధ రాజకీయ దృక్పదాలు మనదేశంలో వుండకూడదా?

మనో:—యిలాగే ప్రతిదీ అపార్థం చేసుకుంటావు! మన ప్రస్తుత ముఖ్యాశయం స్వరాజ్యమేక దా!...అందాకా ఒకే మార్గాన పోగూడదా!......మీ రహస్యాదే మయినా, స్వతంత్ర సాధనే లక్ష్యంగా పెట్టుకొని, ఐకమత్యంతో పోరాడమన్నదిగాని, జాతీయ సంస్థల కెదురుగా పోరాడమన్నదా? అస్వతంత్రులమై బేడీలు వేసిన ఖైదీలమై, ఏకకంఠంతో స్వాతంత్ర్య గీతము పాడక, బేడీల మెరుగు భేదాలు చూచుకొని కీచులాడుకొనుట హాస్యాస్పదముకాదా?

అహో:—(స్వ) నాకేదో జ్వరం వచ్చినట్లున్నది!...

(రైతు గోపాలం తిరిగి వస్తాడు.)

గోపా:—బాబూ, సుశీలమ్మగారిని తండ్రి యింటినుండి పొమ్మన్నారంట! వస్తున్నారా!

అహో:—సరే, నే వస్తానికి! వంట్లోకూడ సరిగా లేదు.

(వెళ్తూవుంటాడు)

మనో.—కనుక, నీలో నీవాలోచించుకొంటే, నియిజాల్లో నుంచి నిజములో పడ్తాన్!

[తెర]

## ద్వితీయ రంగము

[శర్మ గృహం. శర్మ సుస్తీగా వుండటంచేత పడుకొని వుంటాడు. భార్య రాజ్యలక్ష్మి విసురుతూ వుంటాది. వసుంధర పక్కనే నిల్చొని వుంటుంది.]

రాజ్య:—నేచేస్తే వింటారుటండీ! హాయిగా మన గ్రామంలో మనం కూర్చోని, పాడీ, పంటా చూచుకుంటూ, యేదో పురాణం కాలక్షేపం ధాన్యా పురుషార్థం,... యిూ ఆయాశమెందుకూ ..

శర్మ:—వూరుకోవే.. నన్నెంత సతాయిస్తావ్!...నా జీవితానికి అవలక్షణాలన్నీ ఏర్పడుతున్నాయి!

రాజ్య:—పో, పొమ్మని దానిని కాస్తా యింట్లో నుంచి వెళ్ళగొట్టారుకదా అంటే కోపం!...అంది వుండగా కళకళ...

శర్మ:—(దగ్గి) నా ప్రారబ్ధం!...

రాజ్య:—పోనీ!...కలెక్టర్లు, జడ్జీలను తలచుకోవడమే కాని దేవుడివి రోజుకో క్షణం తలచుకుంటే యీ కష్టాలు, దిగుళ్ళు దాపురించేవా?

శర్మ:—ప్రాణం పోవడం లేదుకదే, అప్పుడే దేవుడుని తలచుకుంటావు!

రాజ్య:—ప్రాణం పోతువుంటేగాని దేవుడు జ్ఞాపకం రాడా యేమిటి?...అసలు మీ వితండ వాదాలే......
అమ్మాయి, శాస్త భక్తిరసమైన దేదయినా పాట పాడమ్మా!...

పాట. (9)

వసం:—మాయా కల్పితమే జగంబూ
మానవుడా! మేల్కొనుమురా!
పెదవుల పైన రామనామము
యెదలో విచ్చిన కామతంత్రము
ధనము మూలమీ మాయా జగతికి
ప్రేమనునది లేదూ......॥మాయా॥
నాది నీదియని భేధాలెంచీ
సలిపోకురా పాపపరిధిలో
మానవసేవే మాధవసేవని
మనసు నిల్పుకోరా......॥మాయా॥

శర్మ:—మనోవ్యాధికి జ్వరముంటుందా?

రాజ్య:—మనోవ్యాధితో అన్ని లక్షణాలు దాపురిస్తాయి!

శర్మ:—ఓకాయన నాలాంటివాడికి చాలా మందికి నయం చేసాడు అహోబలరావు తీసుకు వస్తానన్నాడు! అతనికికూడా యిలాంటి జ్వరం వస్తే...నయం చేసాడట!...

రాజ్య:—అహోబలరావుది అంటువ్యాధంటే! యింకేది! ఆయన సాంగత్యం వల్లే, మీకీ వ్యాధి వచ్చి వుంటుంది!

[లోపలనుంచి "రావు సాహెబ్ రామనాధ శర్మగారూ!" అని పిలుపు. వసుంధర తలుపు తీయడానికి వెల్తుంది. అహోబలరావు, రష్యా డాక్టరు (క్రిష్టియన్ ఫాదరీలు ధరించే తెల్లటికోటు. గడ్డం, కళ్ళజోడు. రాజ్యలక్ష్మి, వసుంధర లోపలికి వెళ్తారు. అహోబలరావు, డాక్టరు కూర్చుంటారు.]

అహో:—శర్మగారూ, వీరే మీతో చెప్పిన డాక్టరుగారు! మీ సమాచారమంతా తేటతెల్లిజంగా చెప్పాను! ......తీరా ఎన్నికల సమయం వచ్చేసరికి, యిలా మీరు సుస్థిగా వుండటం నాకు బలేకష్టంగా వుందండీ! యింకా మీరు మూఁకు అభ్యర్థిగా వుంటారు...అని ఎంతో...

శర్మ:—ఆ, అసలు విరమించుకుందాం.. జబ్బు వాడివికూడా అయినా ననుకుంటున్నాను!

అహో:—ఎంతమాట!...వ్యాధి ఎంతలో నయమవుతూ వండీ! (శర్మతో డాక్టరు చూపుతూ) వారి భాషలో మాట్లాడుతారు, నే చెప్తాను!...

శర్మ: —రష్యాభాష! రష్యావాడిని అర్థం చేసుకోగలవన్న మాట?

అహో:—ఎంతమాటన్నారు! రష్యాయిజము అర్థం చేసుకుంటేనేగా మనకమ్యూనిజము మెస్మరిజ మయినది!

[శర్మ తన నాడి చూడమని డాక్టరుకి చేయనందిస్తే వద్దని సంజ్ఞ చేస్తాడు డాక్టరు]

డాక్టరు:—సుపర్ బస్ లుబోటా రష్యనాష్!

శర్మ:—ఏమిటీ! బస్సుమీదో, బోటుమీదో రష్యావెళ్ళమంటాడూ?

అహో:—కాదు. రష్యాదేశంలో యీవ్యాధి విపరీతంగా వుండేదట!...

డాక్ట:—ఆస్థటూక్రిమ్లిన్ దగుల్బాజీ!

అహో:—ఆస్థి, అజ్ఞానంవుంటే యీవ్యాధిపట్టుకుంటుందిట.

డాక్టర్:—నాడిటన్ జుల్కావఫెకుట!

అహో:—నాడి చూడనక్కరలేదు. యిదొక మనోవ్యాధిట!

శర్మ:—మరేమిటి, మందేమైనావుందా? కుదురుస్తాడా?

అహో:—(డాక్టరుతో) అణిఫాకజిమని దవాబులా?

డా:—తీవ్రిస్లీఘటిమన్నా!

అహో:—తీవ్రంగా ముదిరిపోతోందిట!... లోపల అవయవాలలో ప్రచండవిప్లవం ప్రజ్వరిల్లుతోంది! అవయవాలు దేహానికి బానిసలుగావుండటం సహించవ

ఎదురుతిరిగి చెలరేగుతున్నాయి! స్వేచ్ఛ కావాలట! విప్లవజ్వాలలు మండిపోతున్నాయి. మీకు జ్వరం మాగిపోతున్నది!... ఆజ్వాలలు చల్లార్చి మీకు అవయవాలను నిరంతర దాస్యంలోవుంచేదే వీరి "ఔషధాయిజము"!...

శర్మ:— (అందాకా తెల్లబోయిచూస్తూనే వున్నాడు) టట్! యిదంతా ఆనాల్గుమాటలలో చెప్పాడా? యేంమంచి భాష, యేమి మంచివైద్యం వారిది!...

అహో:—వారిదంతా సూత్రంలో మోతీయిజం?...

డాక్టరు:— (శర్మనుచూస్తూ) ఎరాగాన్ రితమ్‌గతమ్‌బాతమ్!

అహో:—యీవాతావరణం మీవ్యాధికి కారణం! గాలి మారాలి! ఎర్రటిగాలి వీల్చాలి! (శర్మ తెల్లబోయి చూస్తూవుంటాడు)

డాక్టరు:—ఏకణోతురుఘు జాకావ్!

అహో:—వెంటనే మీరు కమ్యూనిస్టుపార్టీలో చేరాలి! మెంబరిజము - నిబంధనలు - వీరిమందు...

[యిలా ధోరణిలో అహోమాట్లాడుతూ వుండగా శర్మలేచి డాక్టరు గడ్డాన్ని పట్టుకోగా గడ్డం వూడి వస్తుంది! అహోబలరావును డాక్టరుని పట్టుకొని]

శర్మ:—(అహోబలరావుతో) నీవు చెప్పకుండానే అర్ధమవుతుంది!...నారోగమేకాదు, మీరోగమూ అర్ధమవుతోంది!...మాయాబురఖాలతో మతులు చెడిపోయి

మాట్లాడుతున్నారు. మీ మెస్మరిజంతో (యిద్దరినీ క్రిందికి తోస్తూ) అయోమయిజములో) చతికిలబడి లేవలేకుండా వున్నారు!...

(స్వగతం ముందరకు వచ్చి) అజ్ఞానంధకారంలో అనేక మోసాలు, తప్పటాడుగులు, మిణుగురు పురుగులు!...యిప్పటికి దూరాన వెలిగే సత్య జ్యోతిని చూడకలుగుచున్నాను!

[లోపలనుంచి స్లొగన్సు "భోలో భరత మాతకుజై" "ఢిల్లీచలో" "జైహింద్" "స్వాతంత్రిమా జన్మహక్కు" వసుంధర పరుగెత్తుకుంటూ ప్రవేశం.]

వసుం:—నాన్నా! సుశీలక్క, కాంగ్రెసుదళం జై జై నినాదాలతో ఢిల్లీ పట్నానికి సాగిపోతున్నారు!... మనంకూడా వెళ్దాం రండినాన్నా!...

శర్మ:—అలాగె వెళ్దాం తల్లీ! (వసుంధర చేయపట్టుకో పోతూవుంటే వసుంధర అహోబలరావు డాక్టర్లను చూసి వారిదగ్గరకు వెళ్తుంది)

వసుం:—(అహోబలరావు, డాక్టరుతో) అయోమయ జాల అహోబలరావుగారు!... లేండి!...స్వాతంత్రి భేరి వినబడటంలేదా! (వారిద్దరూ ఒకరి నొకరు చూచుకుంటూ లేచి...అందరూ నడుస్తూ వుంటారు. లోపల Slegums వినబడుతూ వుంటాయి)

(తెర)

---

## తృతీయ రంగము

మనో:—భారతీయులారా! మూడువంద లేండ్లనుంచి మన దేశాన్ని కొల్లగొట్టుచూ మనల నిరక్షరాస్యులుగా బానిసలుగా చాలక ప్రజాపీడిత సామ్రాజ్య విధానాన్ని ఎదుర్కొనుచూ స్వారాజ్యమునకై సమరము చేయుచున్న భారత జాతీయ కాంగ్రెసు మరియొకసారి పరిపాలనా భారము వహింప పూనుకొన్నది. నేటి మనస్థితి చెప్ప నలవికాదు. క్షేమములు, కలహములు, దారిద్ర్యము, ఒకవిధంగా కాదు. ఆర్థికంగా, సాంఘికంగా రాజకీయాంగా అన్ని విధాలా అధోగతిలో నున్నారు. కాంగ్రెసు ప్రజా ప్రభుత్వము నేడు ముఖ్యావసరమైన దగుటచే, కాంగ్రెసు ఎన్నికలలో పాల్గొను చున్నది.

స్వాతంత్రము, మతైక్యత, శాంతి కాంగ్రెసు ముఖ్యాశయాలు, జాతీయ పునర్నిర్మాణ ప్రణాళికలో, హరిజనసేవ, కార్మికకర్షకస్థితి, ఆర్థిక సమానత్వం. గ్రామపరిశ్రమలు, జాతీయ విద్యావిధానం నిమ్నజాతులు మొదలైన హంశాలన్నిటిని కాంగ్రెసు మంత్రిల సహకారంతో మనం ఆచరణలో పెట్టి అభివృద్ధి చేసుకొనవలయును. కావున వోటు కాంగ్రెసభ్యర్థికే!

పాట (10)

ఓటువిలువ తెలుసుకోరా! ఓ కైతా!
ఓటువిలువ తెలుసుకోరా!
పాలమున యెముకల పోగుధివైతివి
నోరుమెదల్పగ వీలులేదుగా!
నీలో మణిగే స్వాతంత్ర్యేచ్ఛను
తెలియబరచగా ఓకేరా! ॥ఓటు॥
యుగయుగాల దాస్యానికి లోనై
నవసిపోయిన మాతగనుకురా
ధీర విప్లవపు వీరుడవై తే
జాతిపేరు నిలుపురా! ॥ఓటు॥
వర్గరహితమో సంఘజీవనము
వర్ణరహితమో ధర్మరాజ్యము
భూలోకములో స్వర్గ సృష్టికి
వెన్నెలదారి యిదేరా! ॥ఓటు॥
అరువదేండ్ల త్యాగాలను దలచి
అగష్టువీరుల స్మృతిపథమెంచి
తెల్లజాతిని వెడల నడపగా
శ్రీముఖం బిదమేరా! ॥ఓటు॥

[యింతలో అహోబలరావు, శర్మ, వసుంధర, రాజ్యలక్ష్మి ప్రవేశం, ఆహోబలరావు మనూ కౌగలించుకుంటారు.]

హో: మనూ! జరిగినకాలం మరచి నన్ను స్వీకరించమని వేడుకొంటున్నాను.

మనో:—అహూజలరావు!...స్వీకరించేందుకు మేమెవ్వరం! కాంగ్రెసు నీ సంస్థకాదా!... ఎందరు నాయకులు మరల కాంగ్రెసుతో కలియడంలేదు! నీ హృదయ పరివర్తన సాటిమానవుల కాదర్శనమగునని తలంచుచున్నను...... జై భారతమాతకుజై (అందరూ అంటారు) ... ఎవరిభావములు, మతములు, సాంప్రదాయములు వారివి భారతదేశీయులందరూ ఏకమై స్వాతంత్ర్యదీక్షతో ముందరకు సాగడమే కాంగ్రెసు ఆశయం!

పాట (11)

ఢిల్లీ చలో ఢిల్లీ చలో
భారతజాతి యశోశోభనూ
సర్వలోకములు గుర్తెరుంగురా ॥ఢిల్లీ॥
ఎగురునదే కాంగ్రెసుజండా
పిలుచునదే గాంధిమహాత్మా ॥ఢిల్లీ॥

[సాగిపోతూవుండగా సబ్ ఇన్స్పెక్టరు ప్రవేశం "మా దేశం వదలిపొండి" అని దళంతో కేకలు.]

స. ఇ:—మీలో మీరు ఊరేగింపులతో, పార్టీలతో, ప్రాణాలు తీసుకోడం ప్రభుత్వం చూస్తూ వూరుకోజాలదు. మీకు స్వాతంత్ర్య మీయలేదు! ...... సామ్రాజ్య శాంతి ప్రభుత్వముయొక్క పవిత్ర భాద్యత! ... కనుక .........

సుశీ:—మాలో మాకు భేదాలులేవు. అడుగడుగునకు, క్షణక్షణానికీ, మీరు కల్పించినవే అన్నీకూడా! మీరు

దేశాన్నుంచిపోతే!... (అందరూ 'పోవాలి' అని కేకలు)

అహో:—"అందరూ ఏకంగండి!! "స్వాతంత్ర్యం మా జన్మ హక్కు" (అందరూ అంటారు)

స. ఇ:—వీళ్లేమ ... యీ అల్లరి ఆపేస్తారా! లేక తగిన చర్య తీసుకోమంటారా?

వసుం:—(ముందరకువచ్చి) ఏమంటీ! ... నిరంతర బానిసత్వంలో మునిగిపోయి, స్వాతంత్ర్య శిఖరాలను చూడలేక, స్వాతంత్ర్యం అభిలషించక, ఆత్మవంచకమైన మీ ప్రవర్తన ధర్మమని, భారతీయ సాంప్రదాయ సహజలక్షణమని మీ రనుకొంటున్నారా?

స. ఇ:—అమ్మాయీ! నిన్నుచూస్తే నాకు నవ్వు, కోపం వస్తున్నయి! ... నీ వయస్సుకి, నీ మాటలకూ బలవత్తరమైన బ్రిటీషు సామ్రాజ్యాధికారాన్ని ధిక్కరిస్తున్నావు! నీ పాటలాపి వెళ్ళిపోవలసింది.

వసుం:—వెళ్ళిపోవడమా! నా జాతీయగీతం నే పాడుకోవలసిందే! ఆ పాట పాడుతూవుంటే నా హృదయం సంతోషంతో వుప్పొంగి పోతుంది. ... ఆ పాట, యీ పతాకం నాకిచ్చే ఆనందం చెప్పలేను! ... వీటికొరకు నా ప్రాణాలైనా అర్పిస్తాను. ...

స. ఇ:—(వసుంధర చేతిలో జండాలాక్కొంటాడు) ఆ!

వసు:—మీ చేతిలో ఆ జాతీయపతాకం చూస్తూ వుంటే నాకెంతో సంతోషంగా వుంది!... చాలా సున్నిత హృదయం కలవారు లాగా కనిపించు తున్నారు ...

